# బుధవారం జూలై 15

శక 1886 ఆషాఢ 24

## హైదరాబాద్-ఎ

ఉ॥ ప్రసారము I

405.4 మీ (740 కిలోసై)

6-30* సుప్రభాతం, కార్యక్రమవివరణ
6-40 ఆంగ్లములో వార్తలు
6-45 భక్తిరంజని: విష్ణు పల్లకి సేవా కీర్తనలు
6-55 సూక్తి ముక్తావళి: ఆంధ్ర మహాభాగవతము
7-00 తెలుగులో వార్తలు
7-15 సంకీర్తనం (భక్తిపాటలు)
7-30 ఎ. కె. సి. నటరాజన్: క్లారినెట్†
7-45 ఖ్వాయం హుస్సేన్: సారంగి
8-00 ఆంగ్లములో వార్తలు
8-15 లలిత సంగీతం: వి. వసంత
8-30 హెచ్. ఎస్. గురురాజాచార్
9-00* వాతావరణ సూచన, ప్రసార సమాప్తి

మ॥ ప్రసారము II

11-45 ఉన్నత పాఠశాలలకు ఉర్దూ,
12-15 హైదరాబాద్ బి వలె
12.30 కార్మికుల కార్యక్రమము (విజయవాడనుండి రిలే)
1-00 మహిళా సమాజం స్త్రీల కార్యక్రమము
పూల పాట
మన కుటుంబ సమస్యలు
పరిమితి కుటుంబం కథానిక
శ్రోతల ఉత్తరాలు
1-30 హసన్ మహమూద్
1-40 హిందీలో వార్తలు
1-50 తెలుగులో వార్తలు
2-00 హైదరాబాద్ బి వలె
2-10 ఉర్దూలో వార్తలు
2-20 హైదరాబాద్ బి వలె
2-30* ప్రసార సమాప్తి

సా॥ ప్రసారము III

6-00* స్థానిక ప్రకటనలు
6-05 ప్రాంతీయ వార్తలు
6-15 ప్రస్తుతాంశం
6-20 కన్నడ శ్రోతలకు
7-00 తెలుగులో వార్తలు
7-15 అబూస్ ప్రదాన్ (హిందీ) తెలుగూ కా ప్రసిద్ధ నాటక్: వరవిక్రయం ప్రసంగం (హిందీ)
7-30 హైదరాబాద్ బి వలె
8-00 నాటిక (విజయవాడనుండి రిలే)
8-30 హసన్ మహమూద్
8-55 Topic for today
9-00 ఆంగ్లములో వార్తలు
9-15 ఉర్దూలో వార్తలు
9-30 Science in India today Fields of research in India *talk by* Dr. K. R. Ramanathan (relay from Delhi)
9-45 నాటిక (ఉర్దూ)
10-15 ఖ్వాయం హుస్సేన్: సారంగి
10-30 ఆంగ్లములో వార్తలు
10-35 వాతావరణ సూచన, ప్రసార సమాప్తి, జనగణమన

## హైదరాబాద్-బి

## కడప

265.5 మీ (1130 కిలోసై)

## విశాఖపట్నం

322.6 మీ (930 కిలోసై)

సా॥ 6-00 నుండి రా॥ 9-30 వరకు

ఉ॥ ప్రసారము I

89.42 మీ (3355 కిలోసై)
(హైదరాబాద్ మాత్రమే)

6-30* హైదరాబాద్ ఎ వలె
7-45 ప్రసార సమాప్తి

ప్రసారము I (తరువాయి)

49.02 మీ (6120 కిలోసై)

8-00 హైదరాబాద్ ఎ వలె
9-00* వాతావరణ సూచన, ప్రసార సమాప్తి

మ॥ ప్రసారము II

42.02 మీ (7140 కిలోసై)
(హైదరాబాద్ మాత్రమే)

11-45 కర్ణాటక సంగీతం
12-30 హైదరాబాద్ ఎ వలె
2-00 వాతావరణ సూచన, సి. ఇందిరామణి
2-30* ప్రసార సమాప్తి

సా॥ ప్రసారము III

60.12 మీ (4990 కిలోసై)

6-00* హైదరాబాద్ ఎ వలె
6-20 గ్రామస్థుల కార్యక్రమము
7-00 తెలుగులో వార్తలు

## విజయవాడ

357.1 మీ (840 కిలోసై)

ఉ॥ ప్రసారము I

6-30* శుభోదయం, ప్రసార విశేషాలు
6-40 ఆంగ్లములో వార్తలు
6-45 భక్తిరంజని (హైదరాబాద్‌నుండి రిలే)
6-55 సూక్తిముక్తావళి
7-00 తెలుగులో వార్తలు
7-15 చతురంగం కదంబ కార్యక్రమము
7-30 ఉప్పలపాటి లక్ష్మీనారాయణ
8-00 ఆంగ్లములో వార్తలు
8-15 లలిత సంగీతం (హైదరాబాద్‌నుండి రిలే)
8-30 హైదరాబాద్ వలె
9-00 ప్రసార సమాప్తి

మ॥ ప్రసారము II

12-30* కార్మికుల కార్యక్రమము
రంగస్థల సంగీతం
అప్పుడు-ఇప్పుడు: సంక్షేమ కలాపాలు
ప్రసంగం
ఫిల్మ్ సంగీతం
విశేషాలు, కబుర్లు

7-15 గ్రామస్థుల కార్యక్రమము
7-30 వాద్యబృందం
8-00 హైదరాబాద్ ఎ వలె
8-30 హెచ్. ఎస్. గురురాజాచార్
8-55 హైదరాబాద్ ఎ వలె
9-15 Focus: on Matters of current Interest
9-25 విరామ సంగీతం
9-30 హైదరాబాద్ ఎ వలె
9-45 సి. ఇందిరామణి
10-30 హైదరాబాద్ ఎ వలె
10-35 వాతావరణ సూచన, ప్రసార సమాప్తి, జనగణమన

## హైదరాబాద్-సి

245.9 మీ (1220 కిలోసై)
వివిధభారతి (రిలే)
[వివరాలు 48వ పేజీలో]

1-00 మహిళాసమాజం (హైదరాబాద్‌నుండి రిలే)
1-30 ఫిల్మ్ సంగీతం†
1-40 హిందీలో వార్తలు
1-50 తెలుగులో వార్తలు
2-00 వాతావరణ సూచన, ప్రసార సమాప్తి

సా॥ ప్రసారము III

6-00* స్థానిక ప్రకటనలు
6-05 ప్రాంతీయ వార్తలు
6-15 ప్రస్తుతాంశం (హైదరాబాద్‌నుండి రిలే)
6-20 గ్రామస్థుల కార్యక్రమము
శ్రీరామ రామయని వెంకటాద్రిస్వామి కీర్తన
అభ్యుదయ కర్షకులు- పాల ఉత్పత్తి
భాగవతంనుండి పురాణం
ప్రకటనలు, ధరలు, వాతావరణము
7-00 తెలుగులో వార్తలు
7-15 గ్రామస్థుల కార్యక్రమం చెప్పుకోతగ్గ వార్తలు
7-30 అన్నదాత నాటిక (హిందీ) రచన: బలి చోప్రా
7-45 ఫిల్మ్ సంగీతం†
8-00 నాటిక (మద్రాస్‌నుండి రిలే)
8-30 వాద్య బృందం
8-55 Topic for today
9-00 ఆంగ్లంలో వార్తలు
9-15 Focus: on Matters of current Interest
9-25 విరామ సంగీతం†
9-30 Science in India today: *Fields of research in India* talk by Dr. K. R. Ramanathan (relay from Delhi)
9-45 లలిత సంగీతం: ఎమ్. దుర్గాప్రసాద్
10-00 ఉప్పలపాటి లక్ష్మీనారాయణ
10-30 ఆంగ్లంలో వార్తలు
10-35 వాతావరణ సూచన, ప్రసార సమాప్తి, జనగణమన

## విజయవాడ—బి

200 మీ (1500 కిలోసై)
వివిధభారతి (రిలే)
[వివరాలు 48వ పేజీలో]



* సమయసూచన † గ్రామఫోన్ రికార్డ్ ‡ స్థానికపు రికార్డింగ్

బుధవారం జూలై 15

శక 1886 ఆషాఢ 24

## మద్రాస్-ఎ

416.7 మీ (720 కిలోసై)

ఉ॥ ప్రసారము I

6-45 మంగళగానం
6-50 నేటి కార్యక్రమవివరణ, వాతావరణసూచన (తమిళం)
6-55 అరుళ్ వాక్కు: మతగ్రంథపఠనం
7-00 తుదిప్పాడల్‌గళ్
7-15 తమిళంలో వార్తలు
7-30* సి. ఎస్. కృష్ణ అయ్యర్
8-00 మధురగీతం†
8-15 ప్రసార సమాప్తి

మ॥ ప్రసారము II
416.7 మీ (720 కిలోసై)

12-30* మాధ్యమిక పాఠశాలలకు
1-00 పెణ్గులగం స్త్రీలకు (తిరుచ్చినుండి రిలే)
1-30 గానమంజరి†
1-40 హిందీలో వార్తలు
1-50 వాతావరణసూచన, గీతమంజరి†
2-00 తమిళములో వార్తలు
2-10 ఉన్నత పాఠశాలలకు
2-40 ప్రసార సమాప్తి

సా॥ ప్రసారము III
416.7 మీ (720 కిలోసై)

5-30* పునితాంబాళ్ సుందరరాజన్
6-05 ప్రాంతీయశెయిదిగళ్
6-15 శెయిదికురిప్పుగళ్
6-20 గ్రామస్థులకు (తమిళం)
[7-00 నుండి 7-30 వరకు షార్ట్‌వేవ్‌పై గూడా]
7-15 తమిళములో వార్తలు
7-30* శెయిది అరంగం
7-45 నాటిక (తమిళం) (తిరుచ్చినుండి రిలే)
8-00 సేలం ఎస్. జయలక్ష్మి
8-30 సి. ప. ఎస్. కృష్ణమూర్తి
9-00 సేలం ఎస్. జయలక్ష్మి
[9-30 నుండి 10-30 వరకు షార్ట్ వేవ్‌పైగూడా]
9-30 మెల్లిశై ప్పాడల్‌గళ్ సమర్పణ: ఆర్. నాగరాజన్
9-45 వి. కె. కణ్ణయ్య: నాదస్వరం
10-30 వాతావరణ సూచన, ప్రసార సమాప్తి, జనగణమన

## మద్రాస్-బి

ఉ॥ ప్రసారము I
211.3 మీ (1420 కిలోసై)
60.98 మీ (4920 కిలోసై)

6-40 అంగ్లములో వార్తలు
6-45 మద్రాస్ ఎ వలె
7-00 తెలుగులో వార్తలు**
7-15 వాద్య గోష్ఠి
7-30 మద్రాస్ ఎ వలె
8-00 అంగ్లములో వార్తలు
8-15 ప్రసార సమాప్తి

మ॥ ప్రసారము II
211.3 మీ (1420 కిలోసై)
41.90 మీ (7160 కిలోసై)

12-00* కార్మికుల కార్యక్రమము
12-30 మద్రాస్ ఎ వలె
1-00 కదంబం†
1-15 వేణువు, క్లారినెట్
1-30 అంగ్లములో వార్తలు
1-40 గీతమంజరి†
1-50 తెలుగులో వార్తలు**
2-00 మధుర గీతం†**
2-10 మద్రాస్ ఎ వలె
2-40 ప్రసార సమాప్తి

సా॥ ప్రసారము III
211.3 మీ (1420 కిలోసై)
60.98 మీ (4920 కిలోసై)

5-30* పాశ్చాత్య సంగీతం†
6-00 అంగ్లములో వార్తలు
6-05 మద్రాస్ ఎ వలె
6-20 వాతావరణసూచన స్థానిక ప్రకటనలు, వాణిజ్యవార్తలు (అంగ్లం)
6-30 కార్యక్రమవివరణ (తమిళం)
6-35 కాల్‌మణి నాటిక (తమిళం)
6-50 కదంబం†
7-00 తెలుగులో వార్తలు **
7-15 చిత్రగానం†**
7-30 సి. పి. ఎస్. కృష్ణమూర్తి
7-45 తెనుగు వైష్ణవ కవిత: అన్నమాచార్యుల గేయాలు ప్రసంగం**
8-00 అనుబంధాలు నాటిక** రచన: ఒంటెల సిద్ధేశ్వర్
8-30 మద్రాస్ ఎ వలె
8-55 Topic for today
9-00 అంగ్లములో వార్తలు
9-15 Focus: On Matters of Current interest
9-30 Science in India today: Fields of research in India talk by Dr. K. R. Ramanathan (relay from Delhi)
9-45 పాశ్చాత్య సంగీతం†**
10-35 ప్రసారసమాప్తి, జనగణమన

## బెంగుళూరు

ఉ॥ ప్రసారము I
491.8 మీ (610 కిలోసై)

6-30* సుప్రభాత, విచారదీప్తి కార్యక్రమవివరణ
6-40 అంగ్లములో వార్తలు
6-45 గీతారాధన
7-15 టి. కె. రామమూర్తి
7-45 కన్నడంలో వార్తలు
8-00 అంగ్లంలో వార్తలు
8-15 గానవిహార
8-30 ఎన్. వి. రాజేశ్వరి, ఎస్. వి. అనసూయ
8-40 బజారుధరలు
8-45* ప్రసార సమాప్తి

మ॥ ప్రసారము II

12-00* కార్మికుల కార్యక్రమము
12-30 కె. రాఘవేంద్రరావు: వేణువు
1-10 కన్నడంలో వార్తలు
1-20 ఎన్. వి. రాజేశ్వరి, ఎస్. వి. అనసూయ
1-30 అంగ్లంలో వార్తలు
1-40 హిందీలో వార్తలు
1-50 ఎన్. వి. రాజేశ్వరి, ఎస్. వి. అనసూయ
2-00* వాతావరణ సూచన, ప్రసార సమాప్తి

ప్రసారము III

3-00* ఉన్నత పాఠశాలలకు
3-30* ప్రసార సమాప్తి

సా॥ ప్రసారము IV

6-00 అంగ్లంలో వార్తలు
6-05 ప్రాంతీయ వార్తలు, వాతావరణ సూచన (అంగ్లం)
6-10 చిత్రగీతెగళు†
6-35 ప్రదేశ సమాచార
6-45 గ్రామస్థులకు
7-45 కన్నడంలో వార్తలు
8-00 సాహిత్య సాంస్కృతిక కార్యక్రమము (ఉర్దూ)
8-15 For the University Students Hindu astronomical achievements: excerpts from the Mysore University extension lecture by B. V. Raman
8-30 విక్షణె యు. ఎన్. కార్యక్రమము
8-45 కర్ణాటక జానపదగేయాలు
8-55 Topic for today

## మద్రాస్-సి

193.5 మీ (1550 కిలోసై)
వివిధభారతి (రిలే)
(వివరాలు 48-వ పేజీలో)

9-00 అంగ్లములో వార్తలు
9-15 సమాచారదర్శన
9-25 వాద్యసంగీత
9-30 ఢిల్లీనుండి రిలే
9-45 అనూప్ సూర్యనారాయణ
10-35 వాతావరణ సూచన, ప్రసార సమాప్తి, జనగణమన

## తిరుచ్చి

319.1 మీ (940 కిలోసై)

ఉ॥ ప్రసారము I

6-30* మంగళగానం
6-35 స్థానిక ప్రకటనలు (అంగ్లం)
6-40 అంగ్లంలో వార్తలు
6-45 కార్యక్రమ వివరణ
6-50 వాద్య సంగీతం
6-55 మద్రాస్ వలె
7-00 భక్తిగీతాలు
7-15 తమిళంలో వార్తలు
7-30 ఇశైక్కోవై: నాదస్వరం
8-00 అంగ్లంలో వార్తలు
8-15* ప్రసార సమాప్తి

మ॥ ప్రసారము II

12-00* కార్మికులకు
12-30 మాధ్యమిక పాఠశాలలకు
1-00 పెణ్గులగం స్త్రీలకు
1-30 వాద్యసంగీతం†
1-40 హిందీలో వార్తలు
1-50 మెల్లిశై
2-00 తమిళంలో వార్తలు
2-10 ఉన్నత పాఠశాలలకు
2-40 జయభేరిగై-వాద్యసంగీతం
2-45* వాతావరణ సూచన, ప్రసార సమాప్తి

సా॥ ప్రసారము III

5-15* టి. పి. ఎ. ముత్తుకుమార స్వామి: వీణ
5-45 ఆకాశవాణి రికార్డులు
6-00 స్థానిక ప్రకటనలు
6-05 ప్రాంతీయ వార్తలు
6-15 మద్రాస్ ఎ వలె
6-20 గ్రామస్థులకు
7-15 తమిళంలో వార్తలు
7-30 మద్రాస్ వలె
7-45 నలారం
8-00 చిత్రగానం†
8-30 సితార్: నిలయవిద్వాంసుడు
8-45 గాత్ర సంగీతం†
8-55 Topic for today
9-00 అంగ్లంలో వార్తలు
9-15 ఈ మాసపుపాట
9-20 పొన్నొలిర్ భారతం స్కెచ్
9-30 ఢిల్లీనుండి రిలే
9-45 సంగీతమాల†
10-00 టి. పి. ఎ. ముత్తుకుమార స్వామి: వీణ
10-35 ప్రసార సమాప్తి

## ప్రసంగములు

### హైదరాబాద్

జూలై 2 గు॥ రా॥ 7-15 వనమహోత్సవ ప్రాముఖ్యత
జి. సత్యనారాయణ

,, 6 సో॥ రా॥ 9-45 శివశంకరస్వామి గేయ నాటికలు

,, 9 గు॥ రా॥ 7-30 క్రీడారంగ సమీక్ష

### విజయవాడ

జూలై 1 బు॥ సా॥ 6-20 వనమహోత్సవము-ప్రాశస్త్యము

,, ,, ,, రా॥ 7-30 వార్తాచిత్ర సమీక్ష
దంటు కృష్ణమూర్తి

,, 3 శు॥ రా॥ 9-30 కథానిక
దుత్తా దుర్గాప్రసాదరావు

,, 4 శ॥ రా॥ 7-30 క్రీడారంగ సమీక్ష
ఎమ్. జానకిరామయ్య

,, 11 శ॥ రా॥ 7-30 నేటి నాటకరంగం
పసల సూర్యచంద్రరావు

,, 12 ఆ॥ రా॥ 7-30 చరిత్రచేస్తున్న హెచ్చరికలు:
రాజకీయ రంగములో
అచార్య మామిడిపూడి వెంకటరంగయ్య

### మద్రాస్

జూలై 1 బు॥ రా॥ 7-45 పగటి కలలు :
ప్రశాంతమైన సెలవుదినము**

,, 8 బు॥ రా॥ 7-45 విద్యార్థులు—సెలవల
వినియోగము**
డి. వి. శ్యామలరావు

,, 13 సో॥ రా॥ 9-45 భవభూతి కారుణ్యము

,, 15 బు॥ రా॥ 7-45 తెనుగు వైష్ణవ కవిత:
అన్నమాచార్యుల గేయాలు**

## నాటికలు, రూపకములు

### హైదరాబాద్

జూలై 8 బు॥ రా॥ 8-00 ప్రవాసి నాటిక
రచన: ఎన్. కేశవస్వామి

,, 11 శ॥ రా॥ 7-45 మరీ పెద్ద మనుష్యులు నాటిక
రచన: జి. మారుతీరావు

### విజయవాడ

జూలై 1 బు॥ రా॥ 8-00 తస్వీర్ ఉస్కీ నాటిక
హిందీమాతృక: చరంజిత్
తెలుగుసేత: ఆర్.నరసింహామూర్తి

,, 4 శ॥ మ॥ 1-00 రత్నావళి నాటిక
రచన: ఎస్. జానకిరామ శర్మ

,, ,, ,, రా॥ 7-45 మంత్రోదకం నాటిక
రచన: శ్రీనివాస చక్రవర్తి

,, 5 ఆ॥ మ॥ 3-00 చక్రభ్రమణం
కోడూరి కౌసల్యాదేవి నవలకు
రేడియో అనుసరణ: సత్య
నిర్వహణ: సత్య, శ్యామసుందరి

### మద్రాస్

జూలై 6 సో॥ రా॥ 9-30 చందమామ రావె
ఊహా చిత్రం
రచన: పాలిలాల కృష్ణమూర్తి

,, 13 సో॥ రా॥ 9-30 'హరిశ్చంద్ర'
నాటకము నుండి ఒక ఘట్టము
నటన: మాధవపెద్ది సత్యం

,, 15 బు॥ రా॥ 8-00 అనుబంధాలు నాటిక



వి. ఎస్. రాజలక్ష్మి, వి. ఎస్. జయలక్ష్మి (మద్రాసునుండి ఇటీవల ప్రసారితము)



కమలా అశ్వత్థామ: వీణ (ఇటీవల మద్రాసునుండి ప్రసారితము)

# సంగీత కచేరీలు

## హైదరాబాద్

| | | | | | |
|---|---|---|---|---|---|
| జూలై | 1 | బు॥ | రా॥ | 9-45 | ఎస్. రాజషణ్ముఖం |
| ,, | 3 | శు॥ | రా॥ | 9-45 | బి. రామాంజనేయులు: నాదస్వరం |
| ,, | 5 | ఆ॥ | ఉ॥ | 8-30 | ఆర్. జానకీదేవి<br>పి. కుప్పుస్వామి: వయొలిన్<br>ఎస్.వి. సత్యనారాయణ:మృదంగం |
| ,, | 6 | సో॥ | రా॥ | 7-30 | ఎన్. సి. సత్యనారాయణ<br>నేతి శ్రీరామశర్మ; వయొలిన్<br>వి. ఎస్. లక్ష్మినారాయణన్:<br>మృదంగం |
| ,, | 8 | బు॥ | రా॥ | 9-45 | ఎ. ఎమ్. మాణిక్యశర్మ: వీణ |
| ,, | 10 | శు॥ | ఉ॥ | 8-30 | మండా బలరామశర్మ; వేణువు |
| ,, | 12 | ఆ॥ | ఉ॥ | 8-30 | గోసవీడు షేక్ హుస్సేన్ సాహెబ్:<br>నాదస్వరం |
| ,, | 14 | మం॥ | రా॥ | 9-30 | ఎన్. ఎస్. శ్రీనివాసన్: వేణువు<br>మారెళ్ళ కేశవరావు: వయొలిన్<br>ఎ. వెంకటేశ్వరరావు: మృదంగం |
| ,, | 15 | బు॥ | రా॥ | 9-45 | సి. ఇందిరామణి |

## విజయవాడ

| | | | | | |
|---|---|---|---|---|---|
| జూలై | 1 | బు॥ | రా॥ | 10-00 | టి. కె. యశోదాదేవి |
| ,, | 2 | గు॥ | ఉ॥ | 7-30 | కర్రా ఉమామహేశ్వరరావు |
| ,, | 3 | శు॥ | రా॥ | 9-45 | వెలిది సుబ్బారావు: వేణువు |
| ,, | 5 | ఆ॥ | రా॥ | 8-00 | పుల్లెల పేరిసోమయాజులు :<br>వయొలిన్ |
| ,, | 8 | బు॥ | రా॥ | 9-45 | బోలవరపు రామచంద్రరావు: వేణువు |
| ,, | 13 | సో॥ | రా॥ | 7-30 | వి. ఎల్. జానకిరామ్: వీణ<br>జి. షణ్ముఖానందం: మృదంగం |
| ,, | 15 | బు॥ | రా॥ | 10-00 | ఉప్పలపాటి లక్ష్మి నరసయ్య |

## మద్రాస్

| | | | | | |
|---|---|---|---|---|---|
| జూలై | 1 | బు॥ | రా॥ | 9-45 | ఎస్. నారాయణస్వామి పిళ్లై;<br>నాదస్వరం |
| ,, | 2 | గు॥ | రా॥ | 7-45 | రాగం, తానం, పల్లవి:<br>ఎస్. బాలచందర్: వీణ<br>గురువాయూర్ దొరై: మృదంగం |
| ,, | 3 | శు॥ | రా॥ | 7-45 | నెల్లై టి. వి. కృష్ణమూర్తి |
| ,, | 4 | శ॥ | రా॥ | 7-30 | శ్రీరంగం ఆర్. రంగనాధన్<br>తిరుచ్చి బాలసుబ్బరాయులు;<br>వయొలిన్<br>కోయంబత్తూర్ ఎన్. రామస్వామి:<br>మృదంగం |
| జూలై | 5 | ఆ॥ | ఉ॥ | 8-15 | కలక్కాడ్ రామనారాయణ అయ్యర్<br>వి. గోవిందస్వామి నాయకర్:<br>వయొలి<br>నాగూర్ టి. ఎస్. శివరామకృష్ణన్<br>మృదంగ |
| ,, | ,, | ,, | మ॥ | 3-00 | ఎ. ఆర్. సుందరం |
| ,, | 6 | సో॥ | రా॥ | 9-30 | లాల్గుడి శ్రీమతీ బ్రహ్మానందన్:<br>వయొలి<br>కల్పాతి రామనాధన్: మృదంగం |
| ,, | 9 | గు॥ | రా॥ | 7-45 | రాగం, తానం, పల్లవి:<br>చెంబై వైద్యనాథభాగవతర్<br>వి. వి. సుబ్రహ్మణ్యం; వయొలిన్<br>పాల్ఘాట్ కుంజుమణి: మృదంగం |
| ,, | 10 | శు॥ | రా॥ | 7-45 | ఎమ్. ఎ. కల్యాణకృష్ణభాగవతర్<br>వీ<br>కోయంబత్తూర్ ఎన్. రామస్వామి<br>మృదంగ |
| ,, | 11 | శ॥ | రా॥ | 7-30 | మరుత్తువకుడి రాజగోపాల అయ్య<br>ఆర్ కె వెంకటరామశాస్త్రి:<br>వయొలి<br>పి. శ్రీనివాసన్: మృదంగం |
| ,, | 12 | ఆ॥ | ఉ॥ | 8-15 | రుక్మిణీ రాజగోపాలన్<br>వి. ఎల్. వేదగిరి. వయొలిన్<br>ఎమ్. ఎన్. కందస్వామి.మృదంగ |
| ,, | 13 | సో॥ | రా॥ | 9-30 | కె. ఆర్. గణపతి. వేణువు |
| ,, | 14 | మం॥ | రా॥ | 7-45 | కీవలూర్ మీనాక్షి సుందరం పిళ్లై<br>చిత్తూర్ గోపాలకృష్ణన్. వయొలిన్<br>శుచీంద్రం కృష్ణన్; మృదంగం |

## బెంగుళూర్

| | | | | | |
|---|---|---|---|---|---|
| జూలై | 1 | బు॥ | రా॥ | 9-45 | వల్లభం కల్యాణసుందరం<br>ఎమ్ ఎస్. సుబ్రహ్మణ్యం:<br>వయొలిన్<br>కె. ఎస్. గోపాలరావు: మృదంగ |
| ,, | 5 | ఆ॥ | ఉ॥ | 8-30 | అనూర్ ఎస్.రామకృష్ణ: వయొలిన్ |
| ,, | ,, | , | రా॥ | 9-45 | టి. ఆర్. మహాలింగం: వేణువు |
| ,, | 8 | బు॥ | రా॥ | 9-45 | కె. జి కనకలక్ష్మి |
| ,, | 12 | ఆ॥ | ఉ॥ | 8-30 | ఆర్. ఎన్. దొరస్వామి: వీణ |
| ,, | 15 | బు॥ | రా॥ | 9-45 | అనూర్ సూర్యనారాయణ |

## తిరుచ్చి

| | | | | | |
|---|---|---|---|---|---|
| జూలై | 7 | మం॥ | రా॥ | 7-45 | ఎస్. షణ్ముయప్ప: నాదస్వరం |
| | 12 | ఆ॥ | మ॥ | 3-00 | కారైక్కుడి వి శంకరన్ |

# జవహర్‌లాల్ నెహ్రూ: మానవత

చల్లా రాధాకృష్ణ శర్మ

స్వాతంత్ర్య సమర వీరాగ్రణిగా, నవభారత నాయకాగ్రణిగా, స్వతంత్రభారత రథసారధిగా, నిర్మల దయానసవారిధిగా, శాంతిదూతగా, త్యాగమూర్తిగా అన్నిమతాలవారిచేతా అన్ని రాజకీయపక్షాలవారిచేతా సభక్తికంగా సంస్మరించబడుతూవున్న పండిత జవహర్లాల్ నెహ్రూ మానవత్వానికే మెరుగులు దిద్దిన మహాపురుషుడు. 1952 లో మదరాసులో ఒక మహాసభలో ప్రసంగిస్తూ యిలా పేర్కొన్నారు. నవభారత నిర్మాణమే యిప్పటి నా ప్రధానోద్దేశం. ఇందుకోసం నా సర్వశక్తులూ ధారపోయదలచాను. నా తదనంతరం నన్ను గురించి యితరులు ఏమనుకున్నాసరే, దానితోనాకు నిమిత్తంలేదు. కాని నన్ను గురించి ప్రజలు యిలా భావిస్తేచాలు 'భారతదేశాన్నీ భారతీయుల్నీ మనసావాచా ప్రేమించిన వ్యక్తి యీయన. ప్రజలుకూడా ఆయన్ని పరిపూర్ణంగా ప్రేమించారు.' ఇటువంటి ప్రేమమూర్తి మే 27 న శాశ్వతంగా కన్నుమూయడంతో ఒక్క భారతదేశమేకాదు, యావత్ప్రపంచమూ కన్నీరు మున్నీరుగా విలపించింది.

రమారమి యాభై యేళ్ళు మానవసేవకోసం తన యావజ్జీవితాన్ని మీదు కట్టిన మహనీయుడు కోరింది తనకు శిలావిగ్రహాలు నిర్మించమనికాదు. స్మారకచిహ్నాలూ నిర్మించమనీకాదు, ఆయనకోరింది ప్రజాభిమానం. ఆయన దృష్టిలో ప్రజాభిమానంతో పోల్చదగినవస్తువు యీ ప్రపంచంలో మరొకటి లేనేలేదు. ప్రజలంటే ఆయనకంత అభిమానం. ఒకసారి ఆయన యిలా అన్నాడు. చాలా సంవత్సరాలుగా నేను ప్రధానమంత్రిగా వుంటున్నాను. ప్రజాభిమానంకంటే ఏ పదవీ నాకు సంతృప్తి యివ్వజాలదు. ఈ ప్రజాభిమానమే కష్టాలను ఎదుర్కొనే ధైర్యాన్ని నాకు ప్రసాదిస్తున్నది. ప్రజల ప్రేమవల్లనే నేను ప్రధానిగా వుండగలుగుతున్నాను. ప్రజాస్వామ్య యుగంలో ప్రజాభిమానానికిగలవిలువ ఎటువంటిదో ఆ మహనీయునిమాటలు సుస్పష్టం చేస్తున్నాయి.

పదవిలో వున్నా లేకున్నా నెహ్రూ మొదటినుంచీ మా న వ తా వా ది. మానవుడే ఆయనకు సర్వసాక్షి; మానవుని సుఖదుఃఖాలే ఆయనకు సర్వశాస్త్రాలు. సర్వమానవ సౌఖ్యమే తన సౌఖ్యమని మనస్ఫూర్తిగా భావించాడు దేశసౌభాగ్యానికి తోడ్పడే ప్రాజెక్టులూ యంత్రశాలలూ ఆయనకు గుళ్ళ గోపురాలు. మానవుడినీ మానవత్వాన్నీ యింతగాఢంగా, యింత నిష్కల్మషంగా ప్రేమించిన వ్యక్తులు ప్రపంచమహాపురుషులలోనే మనకు చాలమంది కనిపించరు. ఈ దృష్టితో చూసినపుడు నెహ్రూ ఒక అసాధారణ వ్యక్తిగా కనిపిస్తాడు. నిజానికి ఆయన ఒక విశిష్టవ్యక్తి. విశిష్టలక్షణాలెన్నో ఆయనలో మూర్తీభవించినవి. అందువల్లనే ఎక్కడెక్కడివారూ నెహ్రూ నిర్యాణవార్తను వినగానే శోకార్ణవంలో మునిగిపోయారు. తమ ఆప్తమిత్రునీ, ప్రియతమనాయకునీ కోల్పోయినట్లుగా భావించారు; బాధపడ్డారు.

నెహ్రూ అనగానే మనకు స్ఫురణకు వచ్చే విషయాలు చాలా వున్నా ప్రధానంగా యీ మూడు స్ఫురణకు రావచ్చునని నేను భావిస్తున్నాను. ప్రజాస్వామ్యంలో పరిపూర్ణ భక్తి విశ్వాసాలుగలవాడుకనుకనే భారతదేశంలో ప్రజాస్వామ్యవిధానాన్ని పటిష్టం చెయ్యడానికి అహర్నిశలూ ఆయన కృషిచేశాడు. జాతిమతరహితమూ, నవ్యవిజ్ఞానవిలసితమూ, సామ్యవాదసంశోభితమూ అయిన నవభారతాన్ని రూపొందించడానికి తన యావచ్ఛక్తినీ వినియోగించాడు. ప్రజాశ్రేయోబద్ధమైన ఆర్థిక వ్యవస్థను నెలకొల్పడానికి త్రికరణశుద్ధిగా కృషిచేశాడు. పారిశ్రామికంగా తనదేశం ముందుకు పోవాలని ఆశించాడు. కొత్త కొత్త పరిశ్రమలు వెలసి, సిరిసంపదలతో కలకలలాడుతూ మూడుపువ్వులారుకాయలుగా తన మాతృదేశం అభివృద్ధిచెందాలని ఆశించాడు; అందుకు నడుము బిగించి కృషిచేశాడు. యుగయుగాల చరిత్రగల భారతదేశానికి నెహ్రూ ఆశయాలు కొన్ని క్రొత్తవే అయినా, భారత ప్రజలు ఆయనకు అండదండగా నిలిచారు; చేదోడు వాదోడుగా సహాయపడ్డారు.

నెహ్రూ జీవిత చరిత్రను స్థూలంగా పరిశీలించినా, మనకు కొన్ని విచిత్ర విషయాలు స్ఫురిస్తాయి. ఆయన అగర్భశ్రీమంతుడు; కాని అగర్భదరిద్రుల్నికూడా ఆదరించిన మహనీయుడు. ఆయన భారతదేశపు ప్రధాని; కాని ప్రజాసేవకోసం తనసర్వస్వాన్ని అర్పించిన అనఘుడు. పైపెచ్చు సర్వసులభుడు. ఆయన గొప్పపండితుడూ, రచయితానూ. కాని పామరులకు సైతం ఆప్తమిత్రుడు. పైకి ఎంత దర్పంగా కనిపించేవాడో, లోలోపల అంత దయాసముద్రుడుగా వుండేవాడు. అందువల్లనే ఆయన దర్శనభాగ్యం కోసం ప్రజలు గంటలతరబడి నిరీక్షించేవారు. ఆయన వెళ్ళినచోటల్లా తీర్థప్రజ గుమిగూడేది ఆయన ఉపన్యసించినచోట భావసుధాలహరి జాలువారేది.

ఒకసారి ఆయన దక్షిణభారతంలో ఒక చిన్న పట్టణానికి వెళ్లాడు. తమ ప్రియతమ నాయకుని దర్శనంకోసం దారిపొడుగున ప్రజలు తండోపతండాలుగా చేరారు. ఎన్నోచోట్ల కారు ఆగవలసి వచ్చింది. ఒకచోట రోడ్డుకు కొంచెం దూరంలో బెలూన్లు అమ్ముకునే ఒక వృద్ధుడు కనిపించాడు నెహ్రూకి. అతనంటే ఆయనకెందుకో అంతులేని ప్రేమకలిగింది. అంతే, కారు దిగి చెరచెరా ఆవృద్ధుడున్న చోటికి నడిచి వెళ్లాడు నెహ్రూ పండితుడు. అతని భుజంమీద చెయ్యి వేశాడు, ఎంతో ప్రేమగా, బెలూన్ల ధర ఎంత? అని అడిగాడు. ఒక్కొక్కటీ రెండణాలని బదులు వచ్చింది. వెంటనే నెహ్రూ తన ప్రక్కనున్న ఒక మిత్రుడిదగ్గర ఇరవై రూపాయలు అప్పుతీసుకుని, దాంతో ఆవృద్ధుని వద్దవున్న బెలూన్లు అన్నిటినీ కొన్నాడు. ఆచుట్టుప్రక్కలవున్న బాలబాలికల అదృష్టం పండింది. ఎవరిచేతిలో చూసినా రంగురంగుల బెలూన్లే.

నెహ్రూ స్వభావం చాలవిచిత్రంగా వున్నట్టు కనిపిస్తుంది. ఒక్కొక్కసారి బుద్ధదేవుడిలా కన్పిస్తాడు; మరోసారి రౌద్రాకారం దాలుస్తాడు. ఒకసారి నవ్వుతూ దర్శనమిస్తాడు; ఇంకొకసారి ఎంతో చీకాకుగావున్నట్టు కనబడతాడు. ఒక్కొక్కసారి ఆలోచనా నిమగ్నుడై కన్పిస్తాడు. నిజానికి నెహ్రూవంటి వ్యక్తిలో యింత విచిత్రస్వభావం కనిపించడం ఒక విశేషం కాదు. ఎన్నో మతాలకూ, ఎన్నో భాషలకూ, ఎన్నో సంస్కృతులకూ నిలయమైన భారతదేశాన్ని పరిపాలించే వ్యక్తి రకరకాల సమస్య

# ఆకాశవాణి మద్రాస్ కేంద్రానికి డైరెక్టర్ జనరల్ శ్రీ బి. పి. భట్ రాక



తేనీటి విందుకు హాజరైన అతిథులతో పరిచయం





ఇటీవల ఆకాశవాణి మద్రాస్ కేంద్రంలో జరిగిన కార్యక్రమ సలహా సంఘ సమావేశానికి డైరెక్టర్ జనరలు శ్రీ బి. పి. భట్ అధ్యక్షత వహించారు. మొదటి చిత్రంలో శ్రీ భట్‌తో శ్రీ డి. ఎస్. దీకిత్ (మద్రాస్ కేంద్ర స్టేషన్ డైరెక్టర్) శ్రీ సి. ఆర్. నరసింహన్ గార లున్నారు. రెండవ చిత్రంలో ఉన్నవారు సమావేశానికి హాజరైన ఇతర సభ్యులు.

---

లనేన్నిటినో ఎదుర్కోవలసివస్తుంది. పైగా నెహ్రూ ఒక్క భారతదేశానికే సంబంధించిన వ్యక్తికాడు. అంతర్జాతీయ విఖ్యాతినికూడా సముపార్జించిన రాజనీతిజ్ఞుడు. పైకి ఎలా కనిపించినా, కుసుమకోమలమైన ఆయన హృదయం పీడితప్రజలవైపుకే మొగ్గుతూ వుండేది. అందువల్లనే విషాదదృశ్యాలను తిలకించేసరికి, సాధారణంగా దర్పంగా కనిపించే నెహ్రూ నవనీతంలా కరిగిపోయేవాడు.

మన దేశపు చరిత్రలో జాతిపిత అయిన గాంధీవంటి విశిష్టవ్యక్తి మరొకడు మనకు కనిపించడు. గాంధీ తర్వాత గాంధీ అంతటివాడు నెహ్రూ. స్వాతంత్ర్య సముపార్జనకు మార్గదర్శకుడేగాక, గాంధీజీ స్వాతంత్ర్యప్రదాతకూడా. లభించిన ఆ అమూల్య స్వాతంత్ర్యాన్ని పరిరక్షించే గురుతర భారం నెహ్రూ భుజస్కంధాలమీద పడింది. ఎన్ని కష్టాలు ఎదురైనా సరే, భారతీయులు తమ స్వాతంత్ర్యాన్ని తామే రక్షించుకోగలరనే సత్యాన్ని యావత్ప్రపంచానికి తెలియజేశాడు నెహ్రూ. నెహ్రూ వ్యక్తిత్వాన్ని ఎన్నడూ పసిగట్టిన మహాత్ముడు. జ్ఞానవృద్ధులూ వయోవృద్ధులూ ఎందరెందరో కాంగ్రెసులో వున్నా తన రాజకీయ వారసునిగా నెహ్రూనితప్ప మరొకరిని పేర్కొనలేదు గాంధీజీ కాని విచిత్రమేమంటే, గాంధీ నెహ్రూలమధ్య కొన్ని సిద్ధాంతాలకు సంబంధించిన అభిప్రాయభేదాలు వుండేవి. అయినా మహాత్ముడంటే నెహ్రూకి అపరిమితమైన భక్తి. అలాగే నెహ్రూ అంటే మహాత్మునికి అపారమైన విశ్వాసం. ఇటువంటి గురుశిష్యులు ప్రపంచ రాజకీయ చరిత్రలో మనకు మరోచోట కన్పించరు.

గాంధీజీ 1948 లో జనవరి 18 న తన ఉపవాసదీక్షను విరమించాడు. మౌలానా అబుల్‌కలాం ఆజాద్ ఆదరపురస్సరంగా యిచ్చిన నారింజ రసం స్వీకరించాడు మహాత్ముడు. ఆ సందర్భంలో నెహ్రూ తదితర నాయకులు అక్కడే వున్నారు. గాంధీ నారింజ రసం త్రాగుతూవుండగా, నెహ్రూ కళ్లు నీళ్ళతో నిండాయి. కొంతసేపయిన తర్వాత, అందరూ వెళ్లిపోయారు. కాని నెహ్రూ మాత్రం అక్కడినుండి కదలలేదు. అప్పుడాయన గాంధీజీతో, తానూ ఉపవాసదీక్ష వహించినట్లూ, అయితే ఆ సంగతి చివరికి తన ఆప్తులకుకూడా తెలియ బరచకుండా వున్నట్లు నెహ్రూ వ్యక్తం చేశాడు. ఆ తర్వాత నెహ్రూ తన నివాసానికి వెళ్లాడు. కొంతసేపటికల్లా ఉపవాసదీక్షను వెంటనే విరమించవలసిందంటూ గాంధీజీ వద్దనుంచి ఒక చిన్న చీటీ నెహ్రూకు వచ్చింది. నువ్వు చాలాకాలం జీవించాలి. భారత రత్నంగా ప్రకాశించాలి.....అని ఆ చీటీలో గాంధీ పేర్కొన్నాడు. గాంధీజీది వశ్యవాక్కు. ఆయన ఆశీర్వదించినట్లుగానే, భారతీయుల తపఃఫలమైన జవహర్‌లాల్ నెహ్రూ భారతరత్నంగా ప్రకాశించాడు; ప్రకాశిస్తున్నాడు; ప్రకాశిస్తాడుకూడా. గాంధీ అంటే కేవలం భక్తిభావమేగాక, పరిపూర్ణమైన విశ్వాసంకూడా వుండేది నెహ్రూకి. 1946 లో తన గురుదేవుని వుద్దేశించి నెహ్రూ యిలా అన్నాడు.... దెబ్భై యేడేళ్ళ ఆ యువకుని సందర్శించాలన్నా, ఆయనతో మాట్లాడాలన్నా నాకెంతో వుత్సా

హాంగా సంతోషంగా వుండేది. ఆయన్ని కలుసుకున్న తర్వాత మాకు నవోత్సాహం కలిగేది. సమస్యల బరువు తగ్గినట్లనిపించేది

నెహ్రూ ఒక్క మానవుల్నే కాదు ప్రకృతిమాతనే కాదు పశుపక్ష్యాదుల్ని కూడా ప్రగాఢంగా ప్రేమించాడు. మానవుని ఆంతరికమైన ప్రవృత్తిని నోరులేని జంతువులు బాగా గ్రహిస్తాయని ప్రతీతి. కుక్కపిల్లల్ని మొదలుకొని పులిపిల్లలవరకూగల అన్ని జంతువుల్నీ ఆయన ప్రేమించాడు. వాటితో కాలక్షేపం చేసేవాడు. అదేం చిత్రమో, అవికూడా ఆయనపట్ల ఎంతో ప్రేమగా ప్రవర్తించేవి. ఇక ఎఱ్ఱ గులాబీలంటే నెహ్రూకి ఎంత ప్రేమో వట్టిమాటలతో చెప్పలేము. ఆయన హృదయనైర్మల్యాన్ని ఆయన ధరించే ఆ ఎఱ్ఱగులాబీ వ్యక్తం చేస్తూండేది. గులాబీ యిచ్చేటప్పుడల్లా, నెహ్రూ ఎంతో సంతోషంగా వుండేవాడని ఆయన తోటమాలి తన అనుభవాల్ని తెలియజేశాడు ఈ సందర్భంలో ఒకనాటి సంఘటనను మననిచేస్తాను

బహుకార్యనిమగ్నుడైన నెహ్రూ దేశవ్యాప్తంగా జరిగిన ఎన్నికల ప్రచారంలో మునిగితేలుతూ వుండే రోజులవి. ఆరోజు ఎందుకోగాని ఆయన చాలా చిరాకుగా వున్నట్లు కనబడ్డాడు ఆయన్ని నీడలా వెంటాడుతున్న ఫోటోగ్రాఫర్లు యీ సంగతిని పసిగట్టారు. కాని ఒక ఫోటోగ్రాఫరు చరచరా నెహ్రూదగ్గరికి వెళ్లి, ఒక చక్కని ఎఱ్ఱగులాబీని కోటుబొత్తాముకు తగిలించాడు. ఆశ్చర్యం. చిరాకుగా కనబడ్డ నెహ్రూ పెదవులమీద చిరునగవులు చిందులాడాయి ఆ చిరునవ్వుల్లో బొండుమల్లెలు వికసించాయి, పండువెన్నెలలు విరిశాయి. ఆ తర్వాత ఆ ఫోటోగ్రాఫరుతో కలిసి నెహ్రూ ఫోటో తీయించుకున్నారు. నెహ్రూ స్వభావం అటువంటిది.

ఇక పిల్లలంటే నెహ్రూకి ఎంత అనురాగమో, అది లోకవిదితం. దైవస్వరూపులైన బాలబాలికల తొక్కుపలుకులలోని తీయందనాన్ని పరిపూర్ణంగా గ్రహించినవాడు ఒక నెహ్రూయే అన్నా అతిశయోక్తికాదు పిల్లలతో కలసి మెలసి ఆడుకునేవాడు వాళ్ళ మధ్యలో వున్నప్పుడు ఈ ప్రపంచాన్నే ఆయన విస్మరించేవాడు అలాగే ప్రజాసమూహాన్ని చూసినప్పుడుకూడా నెహ్రూజీ ఆనంద పరవశుడయ్యేవాడు కాని క్రమశిక్షణ లోపించినప్పుడుమాత్రం రౌద్రావేశం దాల్చేవాడు. ఇటువంటి సంఘటనలెన్నో నెహ్రూ జీవితంలో మనకు కానవస్తాయి.

75 ఏళ్ళ వృద్ధాప్యంలోకూడా, నెహ్రూలో యౌవనోత్సాహం తొణికిసలాడుతూవుండేది. ఆయన ముఖం ఎప్పుడూ కళకళలాడుతూ చూడముచ్చట గొలిపేది ఆయనకు మెల్లగా నడవడం తెలీదనవచ్చు; చకచకా నడిచేవాడు కాదు, పరిగెత్తేవాడు మరణించే ముందురోజు .. చూడవలసిన ఫైళ్లూ కాగితాలూ చూసేశాను అన్నాడు అంటే, ఒక్కనిమిషం కూడా ఆయన వ్యర్థంచేసి ఎరుగడు. ఢిల్లీలో వున్నా మరోచోట వున్నా. ఆయన మనస్సుమాత్రం ఎప్పుడూ పనిచేస్తూ వుండేది, నవభారతనిర్మాణోద్యమంలో, ఆయన దృష్టిలో నిరంతర కృషియే దైవారాధన ఆమరణాంతం తనదేశంకోసం కృషిచేసిన కర్మవీరుడు జవహర్‌లాల్ నెహ్రూ. నిస్స్వార్థసేవానిరతికీ నిష్కామకర్మకూ ఆయన జీవితం ప్రబల నిదర్శనం. ఇక ఆయన రసవద్రచనలా, సత్యప్రియత్వానికి శాశ్వత సాక్ష్యములు. రాజనీతివిశారదుడుగా ఎంత కీర్తి ఆర్జించినాడో, రచయితగా కూడా అంతకీర్తి ఆర్జించిన సవ్యసాచి నెహ్రూ, దేశసేవయే జీవితలక్ష్యంగా నిరంతర కృషియే పరమాదర్శంగా జీవయాత్ర సాగించిన నవభారత నిర్మాత మన నెహ్రూ పండితుడు. ఆయన మాటలూ చేతలూ దేశాన్ని సమైక్యం చేశాయి.

రవి కవీంద్రుని నిర్యాణాన్ని పురస్కరించుకొని నెహ్రూ ఒక లేఖలో యిలా వ్రాశాడు.

మానవుడు ఎప్పుడో ఒకప్పుడు మరణించవలసిందే. కాని రవీంద్రుని మరణవార్తను విని నేను విభ్రాంతి చెందాను. అంతా అయిపోయింది. ఇక విచారించి లాభంలేదు. మహావ్యక్తి అయిన ఠాకూరును సందర్శించే భాగ్యం కలిగినందుకు మనల్ని మనం అభినందించుకోవాలి గాంధీ, ఠాకూరు పాశ్చాత్యదేశాలనుండి ఎంతో గ్రహించారు. వారి జాతీయభావం సంకుచితమయింది కాదు. వారి సందేశాలు యావత్ప్రపంచానికి చెందుతాయి. అయినా వారిద్దరూ నూటికి నూరుపాళ్ళూ భారతీయులే.

ఈ మాటలు నెహ్రూ పండితునికి కూడా వర్తిస్తాయి. గాంధీ, రవీంద్రుడూ ఆ మహాపురుషుల కోవలో చేరిపోయాడు మన భారత రత్నం జవహర్‌లాల్ నెహ్రూ.



ఎ. వి. కృష్ణమాచార్: నిర్వహణ-సంగీత రూపకం "ఆషాఢ మొదలనేయ దినె" (బెంగుళూర్, జూలై 11)



నెల్లై టి. వి. కృష్ణమూర్తి (మద్రాస్, జూలై 3)



బి. ఎస్. విజయరాఘవన్: ఈ మాసపుపాట (బెంగుళూర్, జూలై 5)

[2-వ పేజీ తరువాయి]

క్రమశిక్షణ సంఘటితచర్య దేశపాటవాన్ని వృద్ధిపరుస్తుం దన్నారు. జాతీయ పునర్నిర్మాణ మహాకార్యంలో తోడ్పడవలసిం దని వివిధ రాజకీయ పక్షాలకు విజ్ఞప్తి చేశారు.

విదేశ వ్యవహారాలు

విదేశవ్యవహారాలు గురించి శ్రీ శాస్త్రి ప్రస్తావించి రాజకీయ వ్యవస్థలతోకాని, సిద్ధాంతాలతో కాని నిమిత్తం లేకుండా అన్ని దేశాలతోను మైత్రీసద్భావాలు పెంపొందించుకొనడమే భారత్ ధ్యేయమన్నారు. పొరుగురాజ్యా లతో మైత్రివృద్ధికి ప్రత్యేకకృషి జరగగలదన్నారు. వాటితో భారత్‌కు కల సంబంధాలను సమరసపూర్వకంగా, గౌరవ ప్రదంగా, న్యాయంగా శాంతియు తంగా పరిష్కరించ యత్నించ గలమని చెప్పారు.

పాకిస్తాన్‌తో సమస్యలను పరిష్కరించుకోడానికి చాలా సహనం కావాలన్నారు.

చైనాతో మైత్రీపూర్వక సం బంధాలు నెలకొల్పుకోవడం భారత్ అభిమతమై వున్నదన్నా రు. చైనా భారత్‌కు చెరుపుచేసిం దని, దురాక్రమణ జరిపి భారత ప్రభుత్వాన్ని, ప్రజలను అగౌ రవ పరచిందని అన్నారు. అయినా చైనాతో వివాదాన్ని శాంతియుతంగానే పరిష్కరించ అభిలషిస్తున్న దన్నారు.




వలసపాలన నిర్మూలనకూ, సామ్రాజ్యవాద నిర్మూలనకు సహాయపడడం తమ నైతిక ధర్మంగా భారత్ యెంచుతున్న దన్నారు.

మానవాళిశాంతి స్వాతంత్ర్యా లకు ఐక్యరాజ్యసమితి ఆశా జ్యోతి అని అంటూ సమితికార్య క్రమాలలో భారత్ ఇకముందు కూడా ప్రముఖభూమిక వహించ గలదన్నారు.

నిరాయుధీకరణ ఆవశ్యక తను వివరించారు. నెహ్రూ శాంతికృషిని కీర్తించారు. అమె రికా అధ్యక్షుడు జాన్సన్ చెప్పి నట్లు యుద్ధావకాశంలేని ప్రపంచనిర్మూలనమే నెహ్రూకు సముచితమైన స్మృతిచిహ్నం కాగలదన్నారు. సర్వస్వతంత్ర పటిష్ట సౌభాగ్య భారత నిర్మా ణము, సమర రహిత ప్రపంచ నిర్మాణము గాంధీజీ, జవహర్లాల్ జీలకు సరియైన స్మృతిచిహ్నా లంటూ వీటిని అవతరింపజేయడా నికిఉద్యమించుదామని శ్రీశాస్త్రి తమ ప్రసంగాన్ని ముగించారు.

# సామరస్య సాధకుడు శ్రీ శాస్త్రి

క్రొత్త ప్రధాన మంత్రి శ్రీ లాల్ బహదూర్ శాస్త్రి అమరజీవి శ్రీ నెహ్రూ యొక్క అత్యంత విశ్వాస పాత్రులైనవారిలో ఒకరు. అందువల్లనే శ్రీ నెహ్రూ తమ విధిబాధ్యతల నిర్వహణలో ఆయనకు పాలు పంచారు భారత ప్రధాన మంత్రిగా నిర్వహించవలసిన విధిబాధ్యతలూ. పరిష్కరించవలసిన సమస్యలూ శ్రీ లాల్‌బహదూర్ శాస్త్రికి క్షుణ్ణంగా తెలుసు.

శ్రీ నెహ్రూ ప్రధానమంత్రిత్వంతో ఏర్పడిన మంత్రి మండలిలో ఆయన 1952 నుంచీ సభ్యుడుగా శ్రీ శాస్త్రి నిర్వహించిన అతిప్రముఖ పాత్రకు తోడు, అటు భారత ప్రభుత్వానికీ, ఇటు కాంగ్రెసు పార్టీకి సమన్వయకారుడుగా, పరిష్కర్తగా, సామరస్య సాధకుడుగా ఆయన ఎనలేని సేవ చేశారు. అతి క్లిష్టమూ, పరిష్కారం అసంభవమూ అనుకున్న జటిల సమస్యలను—అటు ప్రభుత్వంలోనూ, ఇటు కాంగ్రెసు పార్టీలోనూ—పరిష్కరించడానికి శ్రీ నెహ్రూ పూర్తిగా శ్రీశాస్త్రి మీదే ఎక్కువగా ఆధారపడ్డారు. శ్రీ లాల్‌బహదూర్ శాస్త్రి యొక్క తొలి సహచరులలో ఒకరైన కీ॥ శే॥ పురుషోత్తమదాస్ టాండన్ శ్రీ శాస్త్రి గుణగణాలను యిలా ప్రస్తుతించారు' "ఇరుపక్షాలను ఒక త్రాటిమీద నడిపి సామరస్యాన్ని సాధించగల బహు ప్రజ్ఞావంతుడు. క్లిష్టసమస్యలను విడదీసి, రాజీ కుదుర్చడంలో ఆయనకు ఆయనే సాటి". ఉత్తరప్రదేశ్, మధ్యప్రదేశ్ రాష్ట్రాలమధ్య ఏర్పడిన వివాదాలే కానీయండి, రాష్ట్ర శాసనసభా నాయకత్వ ఎన్నిక సందర్భంలో అభ్యర్థిని ఎంచుకునే విషయంలో పొడచూపిన భేదాభిప్రాయాలే కానీయండి, కడుశక్తి సామర్థ్యాలుగల శ్రీ శాస్త్రి సూచించిన రాజీ మార్గం అందరికీ అంగీకార యోగ్యంగా వుండక తప్పదు. ఈ గుణగణాలన్నీ ఆయనకు పూర్వపు దేశీయాంగ మంత్రి కీ॥ శే॥ గోవిందవల్లభ్ పంత్ యొక్క వరప్రసాదాలు; శ్రీ పంత్ ఆయనకు రాజకీయ గురువు అని చెప్పవచ్చు.

కీ॥శే॥ పంత్ ఉత్తర ప్రదేశ్ ప్రధానిగా వున్న సమయంలో, శ్రీ శాస్త్రిని తమ పార్లమెంటరీ కార్యదర్శిగా తీసుకున్నారు. దానికి కారణం శ్రీ శాస్త్రి అందరికీ ఇష్టుడు, కష్టపడి పనిచేస్తాడు. విశ్వాసపాత్రుడు శ్రీ నెహ్రూ జీవితకాలంలో శ్రీ శాస్త్రి ఈ గుణగణాలనే అభివ్యక్తం చేశారు.

శ్రీ శాస్త్రి 1904 లో ఉత్తరప్రదేశ్ లోని వారణాసి జిల్లాకు చెందిన మొగల్‌శరాయ్‌లో జన్మించారు. ఆయన తండ్రి శ్రీ శారదా ప్రసాద్ కొంత కాలం ఉపాధ్యాయుడుగా వుండి తర్వాత ప్రభుత్వోద్యోగం స్వీకరించారు శ్రీ శాస్త్రికి 1½ సంవత్సరాల వయస్సప్పుడే ఆయన తండ్రి మరణించారు. తండ్రి మరణంతో ఆయన తన యిద్దరు సోదరీలతో మాతామహుని ఇంటికి వెళ్లారు. తాతగారు ఆయన్ను వారణాసిలో హరిశ్చంద్ర పాఠశాలలో చేర్పించి చదువు చెప్పించారు. పదిహేడేళ్ళ వయస్సు వచ్చేవరకూ ఆయన ఆ పాఠశాలలో చదివారు. ఆ లోగా పాఠశాలలను, కళాశాలలను బహిష్కరించ వలసిందిగా మహాత్మా గాంధీ యిచ్చిన పిలుపు నందుకుని ఆయన చదువుకు స్వస్తిచెప్పి సహాయ నిరాకరణోద్యమంలో చేరారు. ఆ సందర్భంలోనే ఆయన్ను అరెస్టు చేశారు.

1921 లో జైలునుంచి విడుదలైన తర్వాత ఆయన వారణాసిలోని కాశీ విద్యాపీఠంలో చేరి "శాస్త్రి" డిగ్రీని పొందారు. విద్య పూర్తికాగానే ఆయన రాజకీయాలలో ప్రముఖపాత్ర వహించారు. శ్రీ శాస్త్రికి 23-వ ఏట శ్రీమతి లలితా దేవితో వివాహం అయింది. ఆయనకు నలుగురు కుమారులు, ఇద్దరు కుమార్తెలూ వున్నారు.

1926 లో ఆయన సర్వెంట్సు ఆఫ్ యిండియా సొసైటీలో యావజ్జీవ సభ్యులుగా చేరారు. తమ నివాసాన్ని అలహాబాదుకు మార్చారు. ఆయన నగరపాలక వ్యవహారాలలో హెచ్చు పాత్ర వహించి, అలహాబాదు మునిసిపాలిటీ సభ్యుడుగా ఎన్నికై 7 సంవత్సరాలు పనిచేశారు.



శరణ కమలాలయం (తమిళం, సంగీత రూపకంలో పాల్గొను నటీనటవర్గం (మద్రాస్, జూన్ 27)

ఆయన కాంగ్రెసు సంస్థకు సంబంధించిన అనేక ముఖ్యపదవులను అలంకరించారు. అలహాబాదు జిల్లా కాంగ్రెసు సంఘం కార్యదర్శిగానూ 1930 నుంచి 1936 వరకూ అధ్యక్షుడుగానూ పనిచేశారు. 1935 నుంచి మూడేళ్ళపాటు ఉత్తర ప్రదేశ్ రాష్ట్ర కాంగ్రెసు సంఘం ప్రధాన కార్యదర్శిగా వున్నారు కాంగ్రెసు పార్టీ 1937 లో రాష్ట్ర శాసనసభలలో ప్రవేశించినప్పుడు ఆయన ఉత్తరప్రదేశ్ శాసనసభ సభ్యుడుగా ఎన్నికైనారు.

యువ కాంగ్రెసువాదిగా తన 25వ యేట సంపూర్ణ స్వాతంత్ర్యమే తన ప్రధాన లక్ష్యమని కాంగ్రెసు సంస్థ ప్రకటించింది. ఆ తీర్మాన ప్రతిపాదకులు వేరెవరో కాదు—శ్రీ జవహర్ లాల్ నెహ్రూ.

1921 లోనూ ఆ తర్వాత 1942 లో కాంగ్రెసు నిర్వహించిన ప్రజా ఉద్యమాలన్నిటిలో శ్రీ శాస్త్రి పాల్గొని

ఏడుసార్లు జైలుకు వెళ్ళారు. ఆయన మొత్తం 9 సంవత్సరాలుపాటు జైలులో వున్నారు.

1946 లో తిరిగి ఉత్తరప్రదేశ్ శాసనసభలోప్రవేశించి ముఖ్యమంత్రికి పార్లమెంటరీ కార్యదర్శి అయ్యారు. త్వరలోనే రాష్ట్ర హోం, రవాణా మంత్రి పదవి నలంకరించి ఐదేళ్ళపాటు పనిచేశారు. ఆయన ఉత్తర ప్రదేశ్ హోం మంత్రిగా వున్నప్పుడే శ్రీ నెహ్రూ ఆయన శక్తిసామర్థ్యాలను గుర్తించి, రాష్ట్రపదవికి రాజీనామా యిచ్చి అంతకంటె గురుతరమైన కార్యభారాన్ని స్వీకరించవలసిందిగా కోరారు.

స్వతంత్ర భారతదేశంలో తొలిసారిగా 1951 లో తొలి జనరల్ ఎన్నికలలో కాంగ్రెసు పోటీకి నిలబడింది. అఖిలభారత స్థాయిలో ఎన్నికల ప్రచార నిర్వహణకు సమర్థుడైన వ్యక్తి అవసరమైనాడు, శ్రీ నెహ్రూ ఆయన్ను ఢిల్లీకి పిలిపించి కాంగ్రెసు పార్టీ ప్రధాన కార్యదర్శిగా నియమించారు. ఎన్నికలలో కాంగ్రెసు అఖండ విజయాన్ని సాధించడం శ్రీ లాల్‌బహదూర్ శాస్త్రి యొక్క ఘనతే అని చెప్పాలి.

1952 లో ఆయన రాజ్యసభ సభ్యుడు అయారు. ఆ సంవత్సరం మే నెలలో కేంద్ర రవాణా, రైల్వే శాఖల మంత్రిగా ఆయన నియుక్తులైనారు.

నాలుగేళ్ళ తర్వాత అంటే 1956 నవంబరులో అరియలూర్‌వద్ద జరిగిన రైలు ప్రమాదానికి రాజ్యాంగరీత్యా తాను బాధ్యుడని భావించి మంత్రి పదవికి రాజీనామా యిచ్చారు. ఆ ప్రమాదంలో 150 మందికిపైగా మరణించారు. ఆయన నిర్ణయాన్ని పార్లమెంటూ, దేశమూ హర్షించింది.

ఆ సందర్భంలో కీ॥ శే॥ నెహ్రూ పార్లమెంటులో మాట్లాడుతూ, శ్రీ లాల్‌బహదూర్ అత్యుత్తమమైన నిజాయితీ, విధ్యుక్తధర్మ నిర్వహణ దీక్ష కలవాడని ప్రస్తుతించారు. ఆయన అమాయకత్వం చాటున మంచి సిబ్బరం, కార్యదీక్ష దాగి వున్నాయి. ఆ రాజీనామా సందర్భంలో రెండు గంటలు జరిగిన చర్చకు శ్రీ శాస్త్రి సమాధానం చెపుతూ నవంబరు 27 న పార్లమెంటులో యిలా అన్నారు: "నేను భారీ మనిషిని కానందునా, మృదుభాషిణి అయినందునా నాకు దృఢసంకల్పం లేదని ప్రజలు అనుకోవచ్చు నాకు కండపుష్టి లేకపోయినా, ఆంతరంగికంగా అంత బలహీనుణ్ణి కాను".

ఆయన ఎంతోకాలం ప్రభుత్వాన్ని విడిచి వుండలేదు. 1957 లో రెండవ జనరలు ఎన్నికలు జరిగినప్పుడు, ఆయన లోక్‌సభకు తిరిగి ఎన్నిక అయారు. 1957 ఏప్రిల్ 17న ఆయన కేంద్ర రవాణా, కమ్యూనికేషన్సు మంత్రిగానూ, 1958 మార్చి 8 న కేంద్ర వాణిజ్య పరిశ్రమల మంత్రిగాను నియమించబడ్డారు.

వాణిజ్య పరిశ్రమల మంత్రిగా వ్యవసాయ-పరిశ్రమల ఏకీకరణకు ఒక పథకాన్ని రూపొందించారు. ఆ రెండిటి సమ్మేళనంవల్ల గ్రామ ప్రాంతాలలో నిరుద్యోగ సమస్య తొలగిపోతుందని ఆయన విశ్వాసం. గ్రామ పరిశ్రమలను 20 లేక 30 ఏళ్ళలో చిన్నతరహా పరిశ్రమలుగా మార్పు చేయాలని ఆయన సంకల్పం. ఆ రంగంలో తర్వాత అభ్యుదయానికి ఆ పథకమే ప్రాతిపదిక.

పండిట్ గోవింద వల్లభ్ పంత్ మరణించడంతో, 1961 ఏప్రిల్ 4 వ తేదీన శ్రీ లాల్‌బహదూర్ శాస్త్రి కేంద్ర హోంమంత్రి పదవిని స్వీకరించారు. హోం మంత్రిగా తానునిర్వహించవలసిన బాధ్యతలదృష్ట్యా, మధ్యవర్తిగా, పరిష్కర్తగా, ఆయన శక్తిసామర్థ్యాలూ ఆస్సాంలోని భాషా సమస్యను పరిష్కరించడంలో ప్రస్ఫుటంగా కానవచ్చాయి. ఆ రాష్ట్రంలోని అస్సామీలు, బెంగాలీల మధ్య శాశ్వత ప్రాతిపదికపై ఆయన సామరస్య సద్భావాలను సాధించారు.

1963 మార్చిలో నేపాలుకు వెళ్లిన సుహృద్భావ సంఘం నాయకుడుగా ఆయన ఘన విజయాన్ని సాధించారు. కొలదికాలంగా నేపాలు భారతదేశ సంబంధాలు భేదాభిప్రాయాలు, అపోహల కారణంగా కొంత ఉధృతం చెందాయి. శ్రీ శాస్త్రి కార్యదీక్ష, రాజీమార్గం, ఓర్పుల ఫలితంగా ఉభయదేశాల సంబంధాలు తిరిగి చక్కబడ్డాయి.

కామరాజ్ పథకం దృష్ట్యా కాంగ్రెసు సంస్థ కార్యకలాపాల నిర్వహణకై శ్రీ శాస్త్రి 1963 ఆగస్టులో కేంద్రమంత్రి పదవికి రాజీనామా యిచ్చారు. కాని 1964 జనవరి 24 న ఆయన పోర్టుఫోలియోలేని మంత్రిగా తిరిగి కేంద్ర మంత్రి వర్గంలో చేరారు.

కాశ్మీర్‌లో పవిత్ర కేశం చోరీకి సంబంధించిన జటిల సమస్యలను పరిష్కరించడానికి ఆయన్ను అప్పగించారు. ఆయన కృషి ఫలితంగానే ఆ సమస్య శాంతియుతంగా పరిష్కారమైనది.

శ్రీ లాల్‌బహదూర్ శాస్త్రి మదాం క్యూరీ జీవితచరిత్రను హిందీలో రచించారు. ఈత, బ్యాడ్‌మింటన్, టేబుల్ టెన్నీసు అంటే ఆయనకు ఎంతో యిష్టం. శ్రీ నెహ్రూ వలెనే ఆయనకు బాలలంటే మక్కువ ఎక్కువ. ఆయనకు క్షణం తీరిక దొరికితే బాలలతో కాలం గడుపుతాడు. "నేనుపొట్టి మనిషిని కావడంవల్ల నాతో ఆటలాడడానికి ఎవ్వరూ యిచ్చగించరు. అందుకనే నేను బాలలతో ఆడుకుంటా" అని ఆయన యిటీవల అన్నారు.

ఆయనలో మంచి హాస్యం, సంభాషణా చాతుర్యం, వున్నాయి. బాలల సంఘంలో బహుమతి ప్రదానంచేయడానికి ఆయన్ను ఆహ్వానించగా ఆయన చమత్కారంగా యిలా అన్నారు: "నా కురుచదనాన్ని బట్టే నన్ను యీ ఉత్సవానికి ఆహ్వానించారు."



## అఖిల భారత కదంబ కార్యక్రమము

జూలై 1-వ తేదీ బుధవారం నుండి జూలై 15 వ తేదీ బుధవారం వరకు

(జూలై 5, 12, ఆదివారములు మినహా)

ఉ॥ ప్రసారము I

49.71 మీ (6035 కిలోసై)
49.30 మీ (6085 కిలోసై)

7.00 వందనవార్ భక్తి గీతావళి
7.30 అరుణోదయ సంగీతమంజరి
7.45 ఝుంకార్ వాద్య సంగీతం
8.00 ఉదయగాన్ దేశభక్తిగీతాలు, బృందగానం
8.15 హిందీలో వార్తలు
8.30 ఇంద్రధనస్సు కదంబ కార్యక్రమము
9.28 ఝరోఖా నేటి కార్యక్రమముల వివరణ
9.30 ప్రసారం సమాప్తి

41.44 మీ (7240 కిలోసై)
41.32 మీ (7260 కిలోసై)

మ॥ ప్రసారము II

11.00 మధువన్ సంగీత కదంబం
11.30 గూంజన్
11.45 తంగ్ తరంగ్ లలిత సంగీతం
12.00 కర్ణప్రియ సంగీత మంజరి
12.30 ప్రసారం సమాప్తి

మ॥ ప్రసారము III

41.44 మీ (7240 కిలోసై)
41.32 మీ (7260 కిలోసై)

2.00 మనోరంజన్ మీరుకోరిన పాటలు
3.00 ప్రసారం సమాప్తి

సా॥ ప్రసారము IV

41.44 మీ (7240 కిలోసై)

కర్ణాటక సంగీత కార్యక్రమము

4.00 అంజలి-గీతావళి
4.15 గీతమాలిక
4.45 మధురగీతం మీరుకోరిన పాటలు (బుధ, శుక్ర, ఆదివారములు)
5.45 జయమాల
6.15 ప్రసారం సమాప్తి

సా॥ ప్రసారము V

31.14 మీ (9635 కిలోసై)
49.30 మీ (6085 కిలోసై)

6.30 గజరా గీతికా గుచ్ఛము
7.00 పుష్పావళి మీరుమెచ్చిన పాటలు
7.30 పత్రావళి శ్రోతల ఉత్తరాలు
7.40 చిత్రశాల
7.45 మంజూషా జానపద, ప్రాంతీయ సంగీతం
8.00 తనవంతి
8.15 హిందీలో వార్తలు
8.30 మన్‌చాహే గీత్ మీరుకోరిన పాటలు
9.30 హవామహల్ నాటికలు, రూపకములు హాస్యరచనలు
9.45 రాగ్ రంగ్
10.15 రంగవాణి లలిత శాస్త్రీయ సంగీతం
10.25 ఝరోఖా రేపటికార్యక్రమముల వివరణ
10.30 ప్రసారం సమాప్తి

### ప్రత్యేక కార్యక్రమము

జూలై 3, 11, శనివారాలు

31.14 మీ (9635 కిలోసై)
49.30 మీ (6085 కిలోసై)

10.30 గీత మంజరి లలిత సంగీతం
11.00 ప్రసారం సమాప్తి

జూలై 5, 12 ఆదివారాలు ముఖ్యమైన పండుగ దినాలు

ఉ॥ ప్రసారము I

49.71 మీ (6035 కిలోసై)
49.30 మీ (6085 కిలోసై)

7.00 వందనవార్ భక్తి గీతాలు
7.30 అరుణోదయ సంగీతమంజరి
7.45 ఝుంకార్ వాద్య సంగీతం
8.00 ఉదయగాన్ దేశభక్తిగీతాలు, బృందగానము
8.15 హిందీలో వార్తలు
8.30 ఇంద్రధనస్సు కదంబ కార్యక్రమము
9.28 ఝరోఖా నేటికార్యక్రమముల వివరణ
9.30 ప్రసారం సమాప్తి

ప్రసారము II

41.44 మీ (7240 కిలోసై)
41.32 మీ (7260 కిలోసై)

10.15 రంగావలి
10.30 చిత్రధ్వని సంక్షిప్తశబ్దచిత్రం (హిందీ)
రత్నాకర్ నాటికలు, హాస్యరచనలు, కథలు [ఒక ఆదివారం చిత్రధ్వని, మరో ఆదివారం రత్నాకర్]
11.30 చౌపరా మాటలు, పాటలు
12.00 కర్ణప్రియ సంగీతమంజరి
12.30 ప్రసారం సమాప్తి

మ॥ ప్రసారము III

41.44 మీ (7240 కిలోసై)
41.32 మీ (7260 కిలోసై)

2.00 మనోరంజన్ మీరుకోరినపాటలు
3.00 అప్నాఘర్ మీ ఇంట్లో అందరి!
3.30 ప్రసారం సమాప్తి

సా॥ ప్రసారము IV

41.44 మీ (7240 కిలోసై)

కర్ణాటక సంగీత కార్యక్రమము

4.00 అంజలి-గీతావళి
4.15 గీతమాలిక
4.45 మధుర గీతం మీరుకోరిన పాటలు (బుధ, శుక్ర, ఆదివారములు
5.45 జయమాల
6.15 ప్రసారం సమాప్తి

సా॥ ప్రసారము V

31.14 మీ (9635 కిలోసై)
49.30 మీ (6085 కిలోసై)

6.30 గజరా గీతికాగుచ్ఛము
7.00 పుష్పావళి మీరుమెచ్చిన పాటలు
7.30 పత్రావళి శ్రోతల ఉత్తరాలు
7.40 చిత్రశాల
7.45 మంజూషా జానపద, ప్రాంతీయ సంగీతం
8.00 తనవంతి
8.15 హిందీలో వార్తలు
8.30 మన్-చాహే-గీత్ మీరుకోరిన పాటలు
9.30 హవామహల్ నాటికలు, రూపకములు హాస్యరచనలు
9.45 రాగ్ రంగ్
10.15 రంగ్ వాణి
10.25 ఝరోఖా రేపటి కార్యక్రమముల వివరణ
10.30 ప్రసారంసమాప్తి

ఇతర వివరములకు : ప్రొడ్యూసర్, 'వివిధభారతి' ఆకాశవాణి, పోస్ట్‌బాక్స్ 4, బొంబాయి-1.

Printed at Arutperunjothi Press, Madras-1—Edited and Published by the Station Director All India Radio, Madras-4.

# అఖిలభారత సంగీత కార్యక్రమము



పండిత జస్‌రాజ్ (జూలై 4)



హిర్జీభాయ్ డాక్టర్: విచిత్ర వీణ



నిస్సార్ హుస్సేన్‌ఖాన్ (జూలై 11)



రుక్మిణీ రాజగోపాలన్ (మద్రాస్, జూలై 12)



మదురై బి. ఎ. రామమూర్తి(మద్రాస్, జూలై 5)



జానకి స్వామినాథన్ (మద్రాస్, జూలై 9)



ఎమ్. ఎ. కల్యాణకృష్ణ భాగవతర్, వీణ
(మద్రాస్, జూలై 10)



'శరణకమలాలయం' సంగీత నాటికలో పాల్గొను గాయని గాయకులు
(మద్రాస్, జూన్ 27)

Regd. No. M. 5404

# త్రివేణీ సంగమంలో అస్తి నిమజ్జనం



అమరజీవి నెహ్రూ జన్మస్థానమగు అలహాబాద్‌లోని త్రివేణీ సంగమంలో అస్తి నిమజ్జనమును చూపు దృశ్యం.
ఇందులో శ్రీ నెహ్రూ ఆత్మబంధువులందరూ వున్నారు.



శ్రీ లాల్‌బహదూర్ శాస్త్రి నాయకత్వాన ఏర్పడ్డ నూతన కేంద్ర మంత్రి వర్గం.